## బుడమేరు వరదలవల్ల కలిగిన నష్టం

### అధికారుల అంచనాలు

రోడ్లు, కాల్వల మరమ్మతుకు 1.65 వేలు అవసరం

[స్వకీయవిలేఖరి]

బెజవాడ, సెప్టెంబరు 3: బుడమేరు వరదలకల్ల సుమారు ముప్పది వేలయకరముల వరిచేలు మునిగిపోయినట్లు అధికారులు అంచనావేశారు. బెజవాడ, గన్నవరం తాలూకాలలో మెరకభూములు వరదదెబ్బ తిన్నవి. గుడివాడ, కైకలూరు తాలూకాలలోని కొన్ని గ్రామాలలో మాగానిభూములు దెబ్బతిన్నవి. వరిపైరు బతికిపోయింది. కైకలూరు తాలూకా కొల్లేరు పరిసరగ్రామాల భూములు కొన్ని, యింకా మూడడుగుల నీటిలో మునిగివున్నవి. వరదదెబ్బ తిన్న మాగానిభూములకు అవసరమయేదున్నలు ప్రభుత్వమువారు యిప్పించవలెను. లేక పోయిన ఫలసాయము జాసిగా వుంటుంది.

వరదవల్ల పాడైపోయిన రోడ్ల మరమ్మతు చేయుటకు క్రిష్ణాజిల్లా అధికారులు ఒకలక్ష యేబదివేల రూపాయలు కావలెనని అంచనా వేశారు. వరదవల్ల గండ్లు పడ్డ కాలవల మరమ్మతుకు సుమారు పదిహేనువేల రూపాయలు కావలెనని పబ్లికు వర్క్సు శాఖవారు అంచనావేశారు. వరదవల్ల పంట యెంతనష్టమయింది. అనేవివయాన్ని వ్యవసాయశాఖవారు అంచనాను తయారుచేస్తున్నారని తెలిసింది. బుడమేరులో ఇంత వరద యెన్నడూ చూడలేదని వృద్ధులు కూడా చెప్పుతున్నారు.

## శాశ్వత పరిష్కారానికి సూచనలు

ఇటీవల వరద బాధితులకవసరమైన తక్షణ సహాయం

గన్నవరం తాలూకా రైతు సంఘం అధ్యక్షుడు శ్రీ పెండ్యాల వెంకటేశ్వరరావుగారిలా వ్రాస్తున్నారు.

గన్నవరం: ఈయేటి బుడమేరు వరదల వల్ల 80 వేల యకరములు నీటిలో మునిగిపోయాయి. 4 తాలూకాలలో 30 గ్రామాలకు విపరీత నష్టం కల్గించింది. ఇది పంటలకు అనువైన కాలం. భూమియావత్తు పంటలు,పైరులతో నిండి కనుల కానందంగా ఉండే సమయం. మెరకలో బనంగి, జిలం, ఎరజాకివరి, వేరుశనగ, మొక్కజొన్న పైర్లను, కొరజొన్న, అలచంద, పిల్లిపెసర వగైరా పసుగ్రాసము పూర్తిగా దెబ్బతిన్నవి. చెరువులలోని నీరు గండ్ల ద్వారా బయటకు పోవుచున్నవి. ముందు చెరువుక్రింద సాగు లకు నీటి యెద్దడి వస్తుంది. నీరులేక పైరులు ఎండిపోవచ్చును కూడా. ఆహారకొరత యేర్పడును. మెట్టప్రాంతములో వ్యవసాయ తరుణం కాబట్టి రైతులు తమ పొలములలో వ్యవసాయ పరికరములు వదిలినందున వందలకొలది నాగళ్లు, కాళ్లు, తేళ్లు, దుక్కిమోకులు వగైరా కొట్టుకు పోయాయి. నీటపట్టిన గ్రామాల బీదప్రజలు ఇండ్లుకూలి, గట్టుకు చేరినారు. గత 23 సంll ల తరువాత ఇంత వరద ఎప్పుడు వచ్చియుండలేదు.

మాగాని గ్రామాల సావరగూడెం, జక్కుల నెక్కలం, కేసరపల్లి, మంతెన, తరిగొప్పుల, వేంపాడు, వెల్దిపాడు, ఉంగుటూరు, లంకపల్లి, ఆత్మకూరుపల్లి, ఎలికపాడు, కొయ్యగూరపాడు గారపాడు వగైరా గ్రామాదులలో 100 కి 100 యకరములు జలమయమై పోయినవి. సదరు గ్రామాలలో అనేకవందల బీదప్రజల ఇండ్లు నీటిమట్టమై పోయినవి. వారు నిలువ నీడ లేక పరితపించుచున్నారు. కాబట్టి ప్రభుత్వం వెంటనే ఈ దిగువ చర్యలు తీసుకొనగోరుతాము.

తక్షణ రక్షణకు వెంటనే అధికారులతోను, అనధికారులతోను విచారణ సంఘం నియమించి, విచారణ జరిపించవలయును. ఇండ్లు పోయినవారికి వాసములు వగైరా పరికరములను, తిండి లేనివారికి రేషను సప్లయి చేయించవలయును. గ్రామాలలో వేసిన ఎరువులు కొట్టుకు పోయినందున ముందుకట్టిన భూములకు ఎరువులు ఉచితముగా సప్లయిచేయవలయును. ఎస్టేటు గ్రామాలలోని చెరువుల మరమ్మత్తును వెంటనే చేయుటకు తగు చర్యలు తీసుకోవలయును. బుడమేటినీరు పోవుటను ఎనికేపాడు, కేసరపల్లివద్ద ఏలూరు కాల్వకు వున్న లోయరు తూములలోనున్న కీలును తీయించవలెను.

బుడమేటిముంపు నివారణకు గత 15 సంll నుండి జిల్లా రైతులు వందల సభల ద్వారాను, మెమోరాండముల ద్వారాను ఆందోళన చేస్తూవచ్చారు. ప్రభుత్వము బుడమేటికి రిజర్వాయరు కట్టి నీటిని మెరక ప్రాంతములకు పంపి సాగకు లాయకుగా చేయ సమకట్టి అనేక ప్రదేశములను రిజర్వాయరు నిర్మాణానికి పరిశోధించుట లో కాలము గడుపుచున్నది. కాని ఇంతవరకు కార్యక్రమునకు పూనుకొనలేదు. పోగా ప్రతి సంవత్సరము పంట నష్టమునకు కొన్నిలక్షల రూపాయలు వ్యయమవుచున్నట్లు తప్పటలేదు. రైతులు కొన్ని వందల పశువులను కొంత భాగము పంటను ప్రతి సంవత్సరము కోల్పోవుచున్నారు. కాబట్టి ప్రభుత్వం వెంటనే రిజర్వాయరును కట్టించి, కాలవల ద్వారా పొరుగుల సౌకర్యములు కల్పించి, వంకరటింకరగా నున్న వాగును నిడివిగా కట్టలు వేయించి అధికనీటిని బెజవాడకు పైభాగములో కృష్ణానదిలోనికి మార్చి కరవు కాటకాలకు, ప్రాణ నష్టమునకు కారణమైన వరదముంపును శాశ్వతముగా పరిష్కారము చేయగోరుచున్నాము.

## చంద్రగూడెం వద్ద రిజర్వాయరు కట్టాలి

గుడివాడ: బుడమేటి రైతుల కమిటీ కన్వీనరు శ్రీ బొప్పన వెంకటేశ్వరరావుగారిలా వ్రాస్తున్నారు:

బుడమేరు విజృంభించి కృష్ణాజిల్లాలో సుమారు 50 గ్రామాలను ముంచివేసింది. కొన్ని గ్రామాలలో వరిపైరు పూర్తిగా మునిగిపోయింది. బీదప్రజల గుడిసెలన్నీ పూర్తి మునిగి బడిపోయాయి. వడ్లపుట్లు, పాతర్లు మునిగి ఎందుకు పనికి రాకుండా పోయాయి. వరిగడ్డివాములు సగంవరకు మునిగి కుళ్లిపోయాయి. కొన్ని గడ్డివాములు కొట్టుకొని పోయాయి. వుంటానికి యిల్లు, తింటానికి తిండిలేక ప్రజలు నానాబాధలు పడుతున్నారు. ఇక పశువులసంగతి వేరచెప్ప నవసరంలేదు. ఆ గ్రామాల పరిస్థితి చాలా భీభత్సంగావుంది. సుమారు 60 లక్షల రూపాయలు నష్టం జరిగినట్లు తెలుస్తున్నది.

ప్రభుత్వం వెంటనే పూనుకొని యీ దిగువ కార్యక్రమాన్ని అమలుజరపకపోతే బుడమేటి ముంపుబాధితులు బతకడానికి ఆస్కారం ఉండదు.

ఒక గ్రామంనుండి మరోకగ్రామం వెళ్లడానికి ప్రభుత్వపు సహాయం, ఆయా గ్రామాలకు చేరడానికి పడవలను విరివిగా సప్లయిచేయాలి.

తిండిలేని బీద ప్రజానీకానికి బియ్యం ఉచితంగా పంపాలి.

నష్టపడ్డ పొలాలకు పూర్తిశిస్తు రిమిషను నివ్వాలి.

ఇండ్లుపోయిన ప్రజానీకానికి వాసము వగైరా ఉచితంగా సప్లయి చేయాలి.

తెగినచోట్ల బుడమేరుగట్లను వెంటనే బలంగా పోయించాలి.

పిదప పంటలు పండించుకోవడానికి, విత్తనాలు, ఎరువులు వగైరా రైతులకు ఉచితంగా సప్లయి చేయాలి.

పై సహాయంతో తాత్కాలిక ఉపశమనం మాత్రమే జరుగుతుంది.

బుడమేటి ముంపును శాశ్వతంగా నివారించాలంటే బుడమేటికి చంద్రగూడెం దగ్గర రిజర్వాయరు కట్టాలి. ఈ రిజర్వాయరు ముంపు నివారణే కాకుండా కొన్ని వేల ఎకరాలను కొత్తగా సాగులోనికి తేవడానికి అవకాశమిస్తుంది. కాబట్టి బుడమేటి స్కీమును ఉప్పుటేటి స్కీముకు ముడిపెట్టకుండా చంద్రగూడెం దగ్గర రిజర్వాయరు కట్టడానికి తగు ఏర్పాట్లు చేయవలసినదిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

బుడమేటి రైతాంగమంతా పెద్దఎత్తున ఆందోళనచేయవలసినదిగా కోరుతున్నాను.

## కొల్లేటిముంపు-ప్రజలకర్తవ్యం

### శ్రీ బాపినీడుగారి ప్రకటన

కొల్లేటి ముంపువల్ల ప్రతిసంవత్సరమూ వేలకొలది ఎకరములపంట పాడైపోవుచున్నది. ఇటీవల నేను, మంత్రి శ్రీ భక్తవత్సలంగారు కొల్లేటి ప్రాంతములన్నియూ స్వయముగా పరిశీలించాము. కొల్లేటిముంపు రయితుల మహాసభలు కూడా జరిగినవి. యీ ముంపు నివారణకు స్కీములు అన్నియు సిద్ధముగా యున్నవి. గోదావరి, కృష్ణాజిల్లాలకు ముఖ్యకాల్వలైన తమ్మిలేరు, ఎర్రగాలువ, బుడమేరు, గుండేరు, అమితంగా ప్రవహించి యీ సంవత్సరం కొల్లేటి ముంపును అధికం చేశాయి. వరదలవల్ల చాలాగ్రామాలకు, పంటలకు తీరని నష్టం వాటిల్లినది

నిన్న నేను శ్రీ భక్తవత్సలంగారితో వరదల విషయంలో ప్రభుత్వ కర్తవ్యాన్ని గురించి వివరంగా చెప్పాను. కొల్లేటి ముంపునివారణస్కీములు త్వరగా అమలు జరుపుతామన్నారు.

కొల్లేటి ముంపు నివారణస్కీముల నిర్మాణ ఆందోళనగాక, ప్రత్యేకం యీ ఏడాదిముంపు, పంటలనష్టం, వగైరా యదార్థవిషయములు, పెల్లిగ్రాముల ద్వారాను, విజ్ఞప్తుల ద్వారాను తక్షణం ప్రభుత్వానికి తెలియపర్చవలసినదని కొల్లేటి ముంపు రైతులను హెచ్చరించుచున్నాను. ముంపువల్ల నష్టపడిన బీదలకు స్థానిక పెద్ద రైతులు తక్షణ సహాయం తప్పక చేయుదురని ఆశించుచున్నాను.

### కృష్ణాజిల్లా రైతుసంఘ కార్యదర్శి ప్రకటన

బెజవాడ: కృష్ణాజిల్లా రైతుసంఘ కార్యదర్శి శ్రీ జాలాది రామకోటయ్యగారిలా వ్రాశారు: బుడమేటిలో ఇంతటి వరద 1925 సంll తరువాత ఎన్నడూ రాలేదు. ఈవరదవల్ల కృష్ణాజిల్లాలో గన్నవరం బెజవాడ, గుడివాడ, కైకలూరు, బందరు తాలూకాల్లోని 60 వేల యకరాలు మాగానిభూమి, 20 వేల యకరాలు మెట్ట భూమి నీటిమయమైంది. 50 గ్రామాలలో ధాన్యపు పాతర్లు, పురులు నష్టమైనవి. ఈ గ్రామాల్లోని హరిజనయిండ్లు, మట్టిగోడలు కల్గిన యితరుల ఇండ్లుకూలిపోయినవి. వేలకొలది ప్రజలు అవస్థల పాలయ్యారు.

ప్రభుత్వం వెంటనే యీదిగువ పనులు చేయాలి.

తిండిలేక అల్లాడువారికి, ఇండ్లు నష్టపడ్డవారికి వెంటనే సహాయం చేయాలి.

వరదలవల్ల నష్టపడ్డ భూములన్నిటికి య 1 కి కనీసం 2 బస్తాలు వేరుశనగపిండిగాని, అముదపు పిండిగాని ఉచితంగా సప్లయి చేయాలి.

రెవెన్యూ, ఇరిగేషన్, అగ్రికల్చరల్, లేబరుడిపార్టుమెంటు ప్రతినిధులు ప్రజాసంఘాల ప్రతినిధులతోకూడిన ఒక విచారణ కమిటీని వరదపడ్డ ప్రాంతాలను పరిశీలించుటకు నియమించాలి.

ఆహార, ఇరిగేషన్ మంత్రులు వచ్చి స్వయంగా పరిశీలించాలి.

## ఎఱ్ఱకాల్వ, రాళ్లమడుగు వరదలు

నిడదవోలు: కొవ్వూరు తాలూకా రైతు సంఘ కార్యదర్శి శ్రీ దేవరకొండ సుబ్బారావు గారిలా వ్రాస్తున్నారు.

పశ్చిమగోదావరి జిల్లాలోని ఎఱ్ఱకాల్వ, రాళ్లమడుగులు ఈ మధ్య కురిసిన అధిక వర్షాలకల్ల విపరీతంగా పొంగి తాడేపల్లిగూడెం, కొవ్వూరు తాలూకాలలోని అనేక గ్రామములలో వేలాది ఎకరముల మాగాణి, మెట్టభూములను నీటిమయం చేసివైచాయి. రైతుల గడ్డివాములు, పశువుల పాకలు కొట్టుకొని పోయినాయి. రైతులకు జరిగిన నష్టము అపారము.

జూలై నెలలో కురిసిన వర్షముల వలన ఎఱ్ఱకాల్వ పొంగి ఆనాటికి సేద్యము అయిన మాగాణి, మెట్ట పైరులను నాశనము చేసినది. పబ్లికు వర్క్సు శాఖా మంత్రి యం. భక్తవత్సలం, మాగంటి బాపినీడు, (యం. ఎల్. ఏ.) వెస్టర్న్ జిల్లా ఎగ్జిక్యూటివ్ ఇంజనీయరు గార్లు ఎఱ్ఱకాల్వ ముంపు ప్రదేశమును జూలై 27 తేదీన చూచి వచ్చినారు. వరదలవల్ల నాశనమైన పైరులను తిరిగి రైతులు అనేక వ్యయప్రయాసలు పడి సేద్యం చేశారు.

కాని నెల పూర్తికాకుండానే మళ్లీ విపరీత వర్షాల వలన ఎఱ్ఱకాల్వ విపరీతంగా పొంగి పైరులు ధ్వంసమై పోయాయి.

రాళ్లమడుగు పొంగి గౌరీపట్నం, మలకపల్లి, ధర్మవరం, పంగిడి, చాగల్లు, నెలటూరు, మార్కొండపాడు, బ్రాహ్మణగూడెం, నందిగంపాడు, ఖండ్రారు, దారవరం, నిడదవోలు మొదలైన అనేక గ్రామములలోని వేలాది ఎకరముల మెట్ట పైరులు వందలాది ఎకరముల మాగాణి పైరులను జలమయం చేసివేసింది. ఉడకేసి మెట్టపైరులు చాలాభాగం పాడైపోయాయి.

గనుక ప్రభుత్వం వెంటనే రైతులకు ఉచితంగా ఎరువులు, విత్తనాలు ఇచ్చి, శిస్తు రెమిషన్ల ద్వారా రైతులకు పూర్తిగా సహాయపడాలి. లేనిచో రైతులకు వాటిల్లిన లక్షలాది రూపాయల నష్టము పూండికోలుకోలేరు.

## కర్నూలులో విపరీతవర్షాలు

కర్నూలు, అగస్టు 30: 12 దినములుగా ఈజిల్లా అంతటా కురియుచున్న వర్షములు "చాలా అకాలమైనట్టి" వనియు, అందువల్ల నల్లరేగడభూములలో వేసినటువంటి కొర్ర, జొన్న, వేరుశనగ, పంటలు మాగిపోయే స్థితి వచ్చినదనియు, ఈవానలు తక్షణమే నిలిచి, బాగుగా ఎండలు కాయనియెడల ఇవి చెడిపోవుననియు జిల్లావ్యవసాయ శాఖవారిని విచారించగా తెలిసినది. అయితే ఈవానలవల్ల వేరుశనగ పంటకు గొప్ప మేలుకలిగినది. ఎందుకనగా ప్లాంట్ లైస్ అనే చెడ్డ పురుగులు వేరుశనగపంటనుపట్టి ఉండుననియు, ఈవర్షములో ఆపురుగులు కొట్టుకొనిపోయినవని చెప్పుచున్నారు. అయినాకూడా, వర్షమునిలవకున్న ఈపంటకూడా చెడిపోవును. ఈవానలు ఎర్రనేలలోని పంటలను వరిపైరును కూడా మంచిదని తెలిపిరి. నల్లరేగడభూమి జొన్నవిత్తుటకు ఇదిమంచి సమయము. జిల్లాలోని అనేకచెరువులను సమృద్ధిగా నీర్లువచ్చినవి. (స్వ. వి.)

## విశాఖ పట్టణం మునిసిపల్ ఎన్నికలు

### పోటీలేకుండా 12 గురి ఎన్నిక

విశాఖపట్టణము, సెప్టెంబరు, 3: ఈపట్టణ మునిసిపల్ ఎన్నికల సందర్భంలో 10మంది కాంగ్రెసు అభ్యర్థులు పోటీలేకుండా ఎన్నికయారు. ఇద్దరు స్వతంత్ర అభ్యర్థులు కూడా పోటీలేకుండా ఎన్నికయారు. యూరోపియను సీటునకు ఇంతవరకు ఎవరూ నామినేషన్ దాఖలుచేయలేదు. ఇంకా మిగతసీట్లకుకూడా కాంగ్రెసునకే ఎక్కువమెజారిటీ వచ్చునని తెలియుచున్నది. (స్వ. వి.)

# నవంబరుమాసంవరకూ ఆహార స్థితి అతిక్లిష్టంగా ఉంటుంది

## ప్రస్తుత పరిస్థితుల సమీక్షచేస్తూ కేంద్ర ప్రభుత్వ ఆహారశాఖోద్యోగి ప్రకటన

### కొన్ని రాష్ట్రాల్లో ధాన్యసేకరణ తృప్తికరంగా సాగడంలేదని ఆక్షేపణ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 2: నవంబరునెలలో కొత్తపంట ధాన్యము వచ్చేవరకూ మనదేశ ఆహార పరిస్థితి చాల గడ్డుగా వుంటుంది. కేంద్ర, రాష్ట్రప్రభుత్వములు పరిస్థితిని చక్కబరచుటకు శాయశక్తులా కృషిచేయుచునే వున్నవి. కాని కొన్ని రాష్ట్రములలో ధాన్యసేకరణ సంతృప్తికరంగా జరగటంలేదు. అని ఆహారశాఖోద్యోగి ఒకరు అన్నారు.

సెప్టెంబరు 20 వ తేదీతో అంతమగు నెలకు దేశమంతటా మొత్తం ఆహార ధాన్యముల కొరత 3,50,000 టన్నులు. అందుకుగాను 2,46,000 టన్నులు దిగుమతి కాగలవు వీనిలో 55,200 టన్నులు గోధుమలు, 36,000 టన్నులు గోధుమపిండి, 91,000 టన్నులు బియ్యము. అక్టోబరు, నవంబరు నెలలలో ఇంతకన్న ఎక్కువ మొత్తములు దిగుమతి కాగలవని ఆశించుచున్నారు.

ఎగుమతిచేయు వివిధ దేశములలో పరిస్థితి ఈ విధముగా నున్నది:

ఆస్ట్రేలియా: ఇదివరకే నిర్ణయించబడిన 70 వేల టన్నుల గోధుమలతోటూ గాక అక్టోబరు-నవంబరు నెలలలో మరోక 35 వేల టన్నుల గోధుమల దిగుమతి కావచ్చును.

ఆగ్నేయ ఆసియా: బర్మా, తదితర ఆగ్నేయఆసియా దేశములనుండి నెలకు 50 వేల టన్నులు బియ్యం దిగుమతి యగుచున్నవి.

కెనడా: అనావృష్టివలన ఎగుమతిచేయ వీలగు గోధుమల మొత్తం 70 లక్షల టన్నుల నుండి 40లక్షలటన్నులవరకు పడిపోయినది. ఇందులో భారతదేశమునకు ఎంత మొత్తము లభించునో తెలియదు.

సిరియా: కొద్దిమొత్తములు బార్లీ దిగుమతి చేసికొనుటకు యేర్పాట్లు జరుగుచున్నవి.

అమెరికా: అక్టోబరు, నవంబరు నెలలలో 60 వేల టన్నుల గోధుమలు, 40 వేల టన్నులు మైలో దిగుమతి కాగలవు.

ఈ కొనుగోలులలో పాకిస్థాను ఏమీ పంప నవసరములేదు. తూర్పు బెంగాల్ లో కొంత కొరతవున్నా సింధు, పంజాబులనుండి వారు సర్దుకోగలరు.

భారతదేశమునకు ఆహారపదార్థములు యెగుమతి చేయలేమని పాకిస్థాన్ ప్రభుత్వోద్యోగులు చేసిన ప్రకటనను గురించి మాట్లాడుతూ, ఈ సంవత్సరము పాకిస్థాన్ ప్రాంతమునుండి దిగుమతి చేయవలెనని అంచనావేసిన మొత్తములో సింధునుండి 5 వేల టన్నుల బియ్యం, పంజాబునుండి 10 వేల టన్నుల బియ్యం తప్ప మిగిలినవన్నీ దిగుమతి అయినవనీ, సింధునుండి బియ్యం పంపుటకు పాకిస్థాన్ ప్రభుత్వం అంగీకరించినదనీ ఈయన అన్నాడు. పాకిస్థాన్ ఉద్యోగులు చేసిన ప్రకటన బహుశః రానున్న సంవత్సరపు పంటలను గురించి అయివుండవచ్చును. వచ్చేసంవత్సరం పాకిస్థాన్‌లో అదనపుధాన్యం ఉన్నచో ఇండియాలో యితరవస్తువులు కొనుక్కొని, ధాన్యము రెండుకు ఎగుమతి చేయకూడదు అని ఈయన ప్రశ్నించాడు.

గ్గిపోయినది. మంత్రులు సంపాదించిన వాగ్దానములు పూర్తిగా రూపొందినప్పటికీ గత సంవత్సరము జరిగినంత ఎక్కువగా యిప్పుడు ధాన్యసేకరణ జరుగదు. ఇంకా చెంగల్పట్టు జిల్లాలోని శాసన సభ్యులలో, రెండు ముఠాలు ఏర్పడ్డవి. ధాన్యసేకరణ కార్యక్రమంలో జోక్యము పుచ్చుకొనుచో సేకరణను సవ్యముగా జరుగనిచ్చుటలేదు. దక్షిణ కెనరాలో రేషనింగు దాదాపు స్తంభించినట్లే. మంగుళూరులో, కొన్ని రేషన్ షాపులలో ధాన్యము నిండుకొన్నదట. అచ్చట కొన్ని షాపులలో సగము రేషనులు మాత్రమే యిచ్చుచున్నట్లు తెలియుచున్నది. కాని మంత్రులందరు తమ పర్యటనలు విజయవంతములని, ధైర్యోత్సాహములతో ఉన్నారు. తమ అండన ఉన్న ప్రజాసామాన్యపు సహాయముతో రాష్ట్రమును, క్షామము నుండి రక్షించుటకు మంత్రులు కృతనిశ్చయులై యున్నారు.

## ధాన్యసేకరణ ప్రచారం

### గౌll ఎం. భక్తవత్సలంగారు

మదరాసు, సెప్టంబరు 1: మంత్రి భక్తవత్సలంగారు, ధాన్య సేకరణ ప్రచారం చంగల్పట్టుజిల్లాలో తిరుమషి గ్రామమునందు నేడుప్రారంభించిరి. ఉత్పత్తిదారులు పెక్కండ్రు సమావేశమైనసభలో ఉపన్యసించుచు, ఎవరివద్ద ఏమాత్రం మిగిలియున్నా ప్రభుత్వానికి యిచ్చివేసి, కష్టకాలం దాటించాలని కోరిరి, జిల్లాకలక్టరు ఎస్. వెంకట్రామనుగారు, శాసనసభ్యులు సభకువచ్చి యుండిరి. ఉపన్యాసం ముగియగానే, కొందరు ముందుకువచ్చి 30,000 బస్తాలు యిస్తామని చెప్పిరి. మంత్రి గారు శ్రీపెరంబూదూరు పొన్నేరి తాలూకాలందు సంచారం చేయగా మొత్తం 200,000 టన్నుల ధాన్యం వాగ్దానం చేయబడినవి.

## పుదుక్కోట సంస్థానానికి ధాన్యం

### మదరాసుప్రభుత్వ సహాయం

మదరాసు, సెప్టెం 2: ఆహార క్లిష్టస్థితి నెదుర్కొనుటకు నిమిత్తం పుదుక్కోట సంస్థానం మదరాసు ప్రభుత్వ సహాయమును అర్థించినందున ఆ సంస్థానానికి అగస్టు 1 వ తేదీనుంచి అక్టోబరు నెలాఖరువరకు 800 టన్నుల ధాన్యమును అందులో 720 టన్నులు బియ్యము 80 టన్నులు జొన్నలు మదరాసు ప్రభుత్వం వారు మంజూరు చేసినారు.

## సయాం బియ్యం ధర

బాంకాక్, సెప్టెంబరు 2: సయాం బియ్యమునకు ఇకముందు టన్నుకు 24 స్టర్లింగుగాక 31 స్టర్లింగు యిచ్చుటకు బ్రిటిషు, భారతప్రభుత్వములు అంగీకరించినవి. ఇప్పుడు బర్మా బియ్యమునకుకూడా టన్నుకు 31 స్టర్లింగు యివ్వబడుచున్నవి.

## బ్రిటన్ గోధుమల దిగుమతి తగ్గింపు

వాషింగ్టన్, సెప్టెంబరు 2: బ్రిటనుకు ఎగుమతిచేయుటకు ప్రత్యేకింపబడిన 1,43,000 టన్నుల గోధుమలు తనకక్కరలేదని బ్రిటన్ తెలియజేసినది. ఇవి ఇతర దేశములకు అమ్మెదరో లేదో ఇంకా నిశ్చయింపబడలేదు.

## రాష్ట్ర అహారపరిస్థితి

మద్రాసు, సెప్టెంబర్ 2: ధాన్యసేకరణోద్యమం యింతవరకూ యే విధంగానూ, విజయమును సాధింపలేదు. మంత్రులు తమ సంచారములలో భూస్వాములవద్ద నుంచి అనేక వాగ్దానముల తెచ్చుచున్నారు. సర్కారు జిల్లాలలో, యీ వాగ్దానములు ఫలితముగా ఎంత ధాన్యము వచ్చునది, రానున్న వారములలోగాని తెలియదు. వర్షములచే రోడ్డు చెడిపోయినవి. రవాణా సౌకర్యములు సరిగా లేవు. అదియునుంగాక గత సంవత్సరముకన్నా, సర్కారులలో నూటికి 35 వంతులు ధాన్యసేకరణ తగ్గిపోయినది.

గ్రామములోను రేషనింగు పద్ధతి అమలులోనున్నది. ఈరెండు పట్టణములకును రెండు వారాలకు సరిపోవునంతటి ధాన్యం కలదు. మద్రాసు ప్రభుత్వంవద్దనుండి బియ్యం దిగుమతికై ఎదురు చూచుచున్నాము. ఈ జిల్లాలోని మిగతా ప్రదేశములకు కూడా అహారకొరత లేకుండు నిమిత్తమై 2000 టన్నుల పచ్చజొన్నలుకూడా సప్లయి కావలసియున్నది.

కడప కర్నూలు కాలువక్రింద 50 వేల యకరముల వరిపైరు సాగు అగుచున్నవి. ఈ పొలాలకు ఎరువుగా గానుగపిట్టు కావాలి. ఏ రైతుకు గానుగపిట్టు అవసరమో అట్టివారు హైదరాబాదునుంచి దిగుమతి చేసికొనుటకై పరిమిట్లు ఇవ్వబడుచున్నవి.

ఈ జిల్లాలోని వేరుసెనగనూనె తీయు మిల్లులలోని వేరుసెనగపిట్టు దొంగమార్కెట్టుకు పోవుచున్నది. అట్టి వ్యాపారమును నిర్మూలించుటకు ప్రయత్నించుచున్నాను.

## కడపజిల్లా అహారపరిస్థితి

కడప, అగస్టు 31: నిన్నటిదినము పత్రికావిలేఖరులతో కడప జిల్లా కలెక్టరుగారు యీ జిల్లా అహార పరిస్థితిని గూర్చి చర్చించుచు యీ క్రింది విషయములను వెల్లడించిరి.

నా సమక్షమున ప్రతియింటికి పోయి ధాన్యమును సేకరించుటవల్ల జిల్లా మొత్తము మీద అగస్టు 21 తేదీ వరకు సుమారు 2000 టన్నుల వరిధాన్యము లభించినవి. కడపజిల్లా అంతటిలోను జమ్మలమడుగు, పులివెందుల తాలూకాలలో తప్ప మరి ఎచ్చటను ధాన్యము కొరత అంత ఎక్కువగాలేదు. రాయచోటి తాలూకానుండి ప్రస్తుతము 50 టన్నుల బియ్యము జమ్మలమడుగు తాలూకాకును, 100 టన్నుల బియ్యము పులివెందుల తాలూకాకును రవాణా చేయుటకై ఉత్తరువు చేసియున్నాను. కడప పట్టణములోను, ప్రొద్దుటూరు పట్ట

### అమలాపురం తాలూకాలో కాటకపరిస్థితి

అమలాపురం, సెప్టెంబరు 2: శ్రీ కె. ప్రకాశంగారు యీ క్రింది ప్రకటన చేయుచున్నారు.

అమలాపురం తాలూకాలో ధాన్యము కొరత పూర్తిగా ఏర్పడినది. హోటళ్లన్నిటికి రేషన్లు ఇచ్చుటలేదు. చాలా గ్రామాలలో బియ్యంలేకపోవుటచే రేషన్ షాపులన్నియు మూయబడినవి. కొన్ని షాపులలో మాత్రము ఒకరోజు రేషన్ యిచ్చుచున్నారు. పరిస్థితులు విషమరూపము దాల్చుచున్నవి.

### పార్వతీపురంలో రేషన్ కొరత

పార్వతీపురం, అగస్టు 29: గత వారమంతా పార్వతీపురం, బెలగాంలోని రేషన్ షాపులలో, బియ్యంలేకపోవుటచే ప్రజలు పూపూతా బియ్యంకిని పోతున్నారని పార్వతీపురం తాలూకా కాంగ్రెసు సంఘకార్యదర్శి గొర్లె సూర్యనారాయణగారు వ్రాస్తున్నారు. (స్వ. వి.)

### గుంటూరుజిల్లా మెట్టతాలూకాలలో క్షామసూచనలు

సత్తెనపల్లి, అగస్టు 30: గుంటూరుజిల్లా మెట్టతాలూకాలలో క్షామపరిస్థితులు తీవ్రరూపం దాల్చుచున్నవి. ఈ వారములో రెండురోజులుమాత్రమే రేషనుయిచ్చారు. వచ్చేవారం అసలే యివ్వరని వదంతిగా యున్నది. రూపాయకు సేరుబియ్యం లేక సేరున్నరజొన్నలు విరివిగా అమ్ముచున్నారు.

## కమలాపురం తాలూకాలో క్షామపరిస్థితి

చిల్లమకూరు, అగస్టు 30: కడపజిల్లా కాంగ్రెసు సభ్యుడు ఎ. పక్కీరప్పగారు యీక్రిందిప్రకటన చేయుచున్నారు.

ఈగ్రామం రేషన్ డిపోలలో మూడు నెలలనుండి ధాన్యం లేదు. చుట్టుపట్ల గ్రామాలలో రూపాయకు కి సే. బియ్యము కూడ దొరకుటలేదు. జనము ఆకలిబాధ కోర్వలేక అల్లాడిపోతున్నారు. ఇచ్చట కడప రాళ్లగనులలో పనిచేసే కూలీలే ఎక్కువగానుండి. అసలు యిది ధాన్యంకొరత ప్రదేశము. నూటికి 60 మంది అన్నంలేక మాటలాడుటకు నోరు లేకపోయినారు. 'దినముల తరబడి అన్నము లేక ఆకలిచేసంచేకంటే ఒక్కసారి మా ప్రాణం తీయకూడదా' అనుతంక్రందనాలు మిన్నుముట్టుచున్నాయి. కాబట్టి ప్రభుత్వము వెంటనే కలిగించుకొని క్షామ పరిస్థితిని అపుటకు తగు ఏర్పాట్లు చేయవలసిందిగా ప్రార్థించుచున్నాను.

## చల్లపల్లి ఎస్టేటు లంకలు

### హైకోర్టులో జమీందార్ పిటిషన్

చెన్నపురి, సెప్టెంబరు 3: ఇటీవల మద్రాసు ప్రభుత్వం 145 వ సెక్షన్ ఉత్తరువుచేసిన చల్లపల్లి లంకలలో భూములను సాగుచేయుటకు పాత రైతులనే నియమించరాదనీ, ఈ సంవత్సరం ఆభూముల సాగు చేయుటకు రైతుల క్షేమం ద్వారానే నియమించవలెననీ, కోరుతూ చల్లపల్లి జమీందారుగారు మద్రాస్ హైకోర్టులో పిటిషన్ పెట్టిరి. 145 వ సెక్షను అమలు జరిగిన తరువాత తహసీల్దారు వేలం వేసి ఈ సంవత్సరము లంక భూములను సాగుచేయుటకు కొందరిని నియమించినారు దానిపై పాత రైతులు నిరాధారులైపోవుచున్నారనీ తమనే నియమించవలెననీ ప్రార్థించుచూ సబ్ డివిజనల్ ఆఫీసరువద్ద పిటిషన్ పెట్టగా సబ్‌డివిజనల్ ఆఫీసరు తహసీల్దారు వేలములను రద్దుపరచి పాత రైతులను నియమించుచూ ఉత్తరువుచేసిరి. ఈ ఉత్తరువు పక్రమమైంది కాదనియూ, లంక భూములు తమకే చెందునని తగవు పెట్టిన రైతులకు భూమిసాగు వొప్పగించరాదనియూ, లంకలలో భూసాయపు హక్కులు ఎవరివో కోర్టు తేల్చి నిర్ణయించవలసియుండగా వారిని ఆ భూములలో ప్రవేశపెట్టరాదనియూ జమీందారు పిటిషన్ పెట్టిరి. కేసు విచారణ వచ్చే వారానికి వాయిదా పడినది

## మదరాసు ధరలు

మదరాసు, సెప్టెంబరు 3

వేరుసెనగ: (581 కా 1-కి ఎక్స్ కోస్టు గిడ్డంగులు) ఫినిష్ (సేల్స్‌టాక్సుతో సహా) పప్పు బజారు 141-0-0

ఇంగ్లీషుకాండి (500 పౌనులు గలది) 1-కి ఆఫీసు 144-0-0

వేరుసెనగనూనె: ఎక్స్‌పెల్లర్ (సేల్స్‌టాక్సుతో సహా)

మదరాసు, బజారు వెల 806, 810

ఆముదం మిల్ డెలవరి ఎక్స్‌పెల్లర్ పర్ ఇంగ్లీషుకాండి 500 పౌనులు గలది రు. 840.

చింతాయనూనె (88 పౌను గల డబ్బా) వెల 29-0-0

పంచదార

2 అంవరు "హస్‌పేట" రూ 85-14-8

బంగారు-వెండి: నేటి మధ్యాహ్నం

1 గంటకు సవరను 1-కి ఎద్వర్డు బొమ్మ వెల 74-8-0 సెట్లాలుగారు తులం 111-12-0 మూస బంగారు 110-4-0 సీను వెండి తులం 100-కి (రడి) 175-8-0 తులం వెండి 1-కి 1-13-0

## నూలుధరలు

గిడ్డంగులవద్ద ధరలు- మద్రాసుమార్కెటు చిల్లర:

10కి గ్రే రు. 8-4-0, 20 గ్రే రు. 12-1-0, 28 గ్రే రు 15-6-0, 30 గ్రే రు. 15-10-0 32 గ్రే 15-14-0 40 గ్రే రు. 17-14-0, 60 గ్రే 18-1-0, 80 గ్రే రు. 24-4-0, 100 గ్రే రు 31-12-0 (రైల్వేరవాణా, తదితర ఖర్చులు లేక)

